ముద్రణకు సహాయకులు:

**జి. నర్సింగరావు**

వికారాబాద్

## శ్రీరామభక్త సమాజము

స్థాపితం : 1937

నాంపల్లి, హైద్రాబాద్.

ద్వారా పునర్ముద్రణ



ముద్రణ ఆర్ కె ఆఫ్‌సెట్ ప్రింటర్స్ లకడీకాపూల్, హైద్రాబాద్ ✆ : 3391649

26-20

# అనంతగిరి మహాత్యం

(విష్ణుపురాణాంతర్గతము)



—: రచయిత :—

కొండాపురం అనంతాచార్యులు

I

# అనంతగిరి క్షేత్రమును గురుంచి

శ్రీ అనంతగిరి అనంత పద్మనాభుని సంక్షిప్త చరిత్ర నిజాం పరిపాలనలో జరిగిన మహాత్మ్యం. కర్మభూమియగు ఈ భరత ఖండము అనేక పుణ్యక్షేత్రములకు పుణ్యతీర్థ నదీనదములకు పుట్టినిల్లు. విశేషముగా కృష్ణా, గోదావరి, తుంగభద్ర, మంజీరా, మరియు ముచుకుందా మొదలగు పుణ్యనదులు ఎన్నియో దక్షిణభారతమున ప్రవహించుచున్నవి. వాటిలో ఎక్కువ భాగము ఆంధ్రప్రదేశమునందు యలరాడుచుండుట గమ్యము. అందులో వికారాబాద్ తాలుకా రంగారెడ్డి జిల్లాకు చెందిన అనంతగిరిలో పుట్టి ముచుకుందానది యను పేరుతో ప్రవహించుచు మన రాజధాని నగరమగు హైదరాబాదులో ప్రవేశించిపారుచున్నది. కాలక్రమమున మూసీనదిగా మారి ప్రసిద్ధమై యున్నది. దీని ప్రభావము విష్ణుపురాణములో విదితము, మరియు అనంతగిరికి మార్కండేయ క్షేత్రమని దామసరోవర మని ప్రతీతి. స్కాందపురాణ మందు యయ్యది విదితము. అనంతగిరి అతిమనోహర ప్రదేశము, బహు విధములైన తరుకుంజముల చేతను బహు విధ మృగ సంకులము చేత నిండి కుసుమ సుగంధ వాసనా మయమై సమస్త తాపముల పోగొట్టు వాతావరణ ప్రదేశమది.

చిరంజీవియగు తపస్వి మార్కండేయుడు తపస్సు చేయుటకు యెగ్యమగు స్థలము కనపరుచుమని బ్రహ్మదేవుని ప్రార్థింప, ఆ విధాత మార్కండేయునకు చూపించిన స్థలమిది. స్కాందములో విదితము ఈ గిరియందే మార్కండేయుడు అనేక వేల సంవత్సరములు తపమాచరించి ఆనంతపద్మనాభుని సాక్షాత్కరింప జేసికొన్నాడు. ద్వాదశి పారణ గురించి భగవదనుగ్రహము వలన గ[illegible] ప్రత్యక్షము

చేసికొన్నాడా తపస్వి. అప్పటి నుండి ఆ సరోవరమునకు భవనాసి తీర్థమని ప్రసిద్ధి. ప్రతి సంవత్సరము ఆషాఢ శుద్ధ ఏకాదశి (శయనేకాదశి) అరుణోదయమునకు భాగీరథీ నిజస్వరూపముతో భవనాసి తీర్థమున సాక్షాత్కరించును.

కలిప్రవేశానంతరము మార్కండేయు డదృశ్యుడయ్యెను. తానారాధించిన అనంతపద్మనాభస్వామి (వాసుదేవసాలగ్రామము) చక్రతీర్థస్థలమయ్యెను. ఇంతకు పూర్వము సుమారు నాలుగు వందల సంవత్సరములు క్రితము నిజాం నవాబుకు సంబంధించిన యొక నవాబు అనంతగిరి అరణ్యప్రాంతము చాలా కమనీయమైనదని, అచ్చటి వాతావరణము అన్ని బాధలను నివారించుననియు వేటాడుటకు అనేక మృగములు కలిగినదనియు, విని వేనవిలో గుర్రపుస్వారులతో బహుపరివారములతో అనంతగిరి వనప్రాంతమునకు వచ్చి గుడారముతో ఉనికి నేర్పరుచుకొని కొన్ని రోజులు నివసించెను. అతని గుర్రపు దళములకు సైసువారలు ప్రతినిత్యము పచ్చిక కోసికొని వచ్చి వేయుచుండిరి. నవాబు ప్రతి నిత్యము గుర్రపు కొట్టమునకు వెళ్ళి పరామర్శించువాడు. వాటి ముందు ఒకే రకమైన పచ్చిక ప్రతినిత్యము కానవచ్చుటయు గుర్రములు దినదినము నిండు దనంబు నొందుటయు కని సైసువారలతో నిట్లనియెను. మీరు కొని తెచ్చు పచ్చిక ఏ ప్రాంతమున నున్నది ఇన్ని రోజులనుండి ఒకే విధముగా కానవచ్చుచున్నది తెలియపరుచుడనిన వెంటనే సైసువారిట్లనిరి. ప్రభూ ఇది దిగువ భాగమున యొక చోట రెండు పల్లపుతావులు గలవు. అందులో యొక పల్లపు భాగమున ఏమి చిత్రమో కాని దానిలో కోసిన పచ్చిక మరల అంతే పెరుగుచున్నది. అందుచే ప్రతి దినము నిరాయాసముగా దాని నుండి తెచ్చి వేయుచున్నామని చెప్పిరి. నవాబు ఆశ్చర్యమొంది ఆ తావెచటనో చూపుడని వారి వెంటజని చక్రతీర్థ స్థలమును చూచెను. మరునాడట్లె చూడగా తొలినాటి మొండ్లు పెరిగి అంతే కనిపించిన తోడనే ఇందేమో, మహత్తు గలదని వితర్కించి దానిని త్రవ్వించగా అందుండి వాసుదేవ సాల గ్రామం



బయలుపడెను. అప్పటి కది యతనికి బోధపడక విచారముతో రాత్రి కాగానే పరుండెను. ఆ రాత్రి ఆ నవాబునకు కలలో "నేననంతుడను ఆలయము నిర్మింపజేసి నన్నిచట నెలకొల్పిన నీకు శుభము కలుగునని" స్వామి సెలవిచ్చిన తక్షణమే నిదురనుండి మేల్కాంచి స్వామివారు సెలవిచ్చిన మాట తలంచి పల్లంలో వెడలిన సాలగ్రామము భగవంతుడనుకొని ఇట్లు వేడుకొనెను. స్వామి నా కాలిలో చిక్కుకున్న తుపాకి గుండు భాదతో పరితపించుచున్నాను. నన్నారోగ్యవంతునిగా చేసిన మీరు సెలవిచ్చినట్లు చేయగలనని మ్రొక్కుకొనెను. అచిర కాలముననే యా నవాబునకు ఆరోగ్యమొనగూడెను. వెంటనే గుడిసత్రములనుకట్టించి స్వామివారిని నెలకొల్పెను, పూజాధికముల నేర్పరచెను.

అతడు మహ్మదీయుడు కావున అచటి కట్టడములలో యిప్పటికి వారి సాంప్రదాయమును తెలుపుచున్నవి. ఆ తర్వాత యది మహారణ్య ప్రాంతమగుటచే క్రూరమృగ బాధవలన స్వామి పూజావిధానములు నిలిచిపోయెను. అటు మీదట స్వామివారు అలంపల్లి గ్రామాధికారి స్వప్నంలో యిట్లు సెలవిచ్చెను, "నన్ను మీ గ్రామమునకు గొనితెచ్చి ఆలయము కట్టించి నిలిపి నిత్యపూజ నైవేద్యములు చేయింపుము నీ కోరిక ఫలించున"ని చెప్పెను. ఆ యధికారి కలనుండి మేల్కొని ఉదయమున గ్రామస్తులనెల్లరనుగుమిగూర్చి యిట్లు చెప్పెను "మనకెల్లరకు శుభోదయము కానున్నది. అనంతగిరీంద్రుడు మన గ్రామమునకు వచ్చెదనని నాకు స్వప్నంలో సెలవిచ్చినాడు మన మెల్లరము అనంతగిరికి మంగళవాద్యములతో నేగితెచ్చి అనంతపద్మనాభస్వామిని యిందునిలిపికొందము" యనిన అందరు మహోల్లాసముతో నేగిస్వామి వారిని తెచ్చి గుడికట్టి అందునిలిపి నిత్యపూజనైవేద్యాదుల నేర్పరిచిరి.

ఆ గిరివరము చుట్టు ఐదు పరువుల పరిమితి ఆనంతగిరి సౌజ్ఞయని స్కాందము అభివర్ణించినది. తామరసరోవరం, భైరవక్షేత్రము, రాకమచెర్ల మున్నగునవి దీనిలోనివే. గిరిపై అనేక తీర్థరాజములు కలవు. లక్ష్మీ తీర్థము

శేషతీర్థం మున్నగునవి. అనేక ఔషదులు కలవు. క్రీ. శ. 1945 నుండి ఈ గిరి యందు వైద్యశాలలేర్పడి యడవి కొంత తొలుగుటచే ఇపుడు యెల్లరకుసంచార సందర్శనం సులభమైయున్నది. ప్రతి ఆషాడ శుద్ధ ఏకాదశి, ప్రతి కార్తీక పౌర్ణిమ స్వామివారు గిరికి వేంచేసి ఉత్సవాదులు జరిపించుకొనును. స్వామిదర్శన మాత్రమున సమస్త కల్యాణములు చేకూరును.

ఇట్లు

కృష్ణాచారి

అనంతస్వామి అర్చకుడు



శ్రీ మదనంతప్రసన్నః

# శ్రీమదనంతగిరి మహాత్మ్యం

(విష్ణు పురాణాంతర్గతమైనది)

## కథా సంగ్రహము

శ్రీ నైమిశారణ్య ప్రదేశమున సూతుడు శౌనకాదులకు సకల పురాణములు వివరించి చెప్పచు విష్ణుపురాణాంతర్గతంబగు ముచుకుంద మహాత్మ్యంబగు అనంతగిరి మహాత్మ్యంబీవిధంబున జెప్ప మొదలిడెను. శౌనకాదులారా ! వినుడు పరాశరమైత్రేయ సంవాదంబగు ముచుకుంద మహాత్మ్యంబను అనంతగిరి మహాత్మ్యంబు జెప్పెద సావధానచిత్తులై వినుడని ఇట్లు జెప్పనారంభించె.

పూర్వంబొకప్పుడు మార్కండేయ మహర్షి సత్యలోకమున కేగి బ్రహ్మదేవుని గనుగొని నమస్కరించి అతని ఆసనమున గూర్చొని పితామహుని నిట్లు ప్రశ్నించెను. " ఓ వాణిమనోహరా ! నాకు నేకాగ్రతతో తపంబొనరింప యోగ్యత స్థలము నెరిగింపుమని కోరెను." అపుడు బ్రహ్మ యిట్లనియె. శేషాద్రి యన ప్రసిద్ధిచెందిన క్షేత్రోత్తమంబున శ్రీ వెంకటేశ్వరుడు రమావినోదియై వసించు అట్టి శేషాద్రి పుచ్ఛ భాగమగు అనంతగిరి వరంబున శ్రీ మదనంత పద్మనాభుడు సన్నిధానుండైయుండు అ గుట్టలోని పల్వలంబునకు ఆషాడశుద్ధ ఏకాదశి తిథి భాగీరథి వచ్చుచుండును. అట్టి దినంబున తత్తీర్థంబున గ్రుంకి బ్రాహ్మణ వైశ్య శూద్ర క్షత్రపుల్కసులు పశుపక్ష్యాదులు పరమపద ప్రాప్తులగుదురు. కావున అట్టి పవిత్ర క్షేత్రమున కేగి నీవు తపమొనరింపుము. నీకు మనోహరుడు ప్రసన్నంబగు అతని దర్శన భాగ్యములభించి నీ తపంబెల్ల ఫలించును. ఒకప్పుడు రాజర్షి యైన ముచుకుందుడు దేవేంద్రుని కోరికపై వేయి

సంవత్సరములు రాక్షసులతో పోరి వారిని వధించెను. అపుడింద్రుడు ప్రీతిజెంది ముచుకుందునకిట్లనియె. ఓ ముచుకుందా ! నీయుపకారము యెన్నటికి మరువలేను. నా శత్రువులగు రాక్షసులవధించి నాకు మేలు చేకూర్చితివి. ఇపుడు ముక్తి దప్ప నీవేమిగోరిన నిచ్చెదను కోరుకొమ్మన ముచుకుందుడిట్లనియె మహేంద్రా చాలాకాలము రేయింబవళ్ళు రాక్షసులతో పోరి వారిని సంహరించితిని. నాకు నిద్రలేనందున నట్టి నిద్ర బడయుటకు మంచిస్థలము చూపించుము నేనిద్రించుతరి యొవరైనను మేల్కొలిపిన తక్షణమే వారు భస్మీభూతులగు నట్లును వరము ప్రసాదింపుమని వేడెను. అట్లేయగుగాక యని శచీపతి వరములు ప్రసాదించెను. శేషాచలపుచ్ఛభాగమగు అనంతగిరిలో ఒక గొప్ప గుహాయున్నది. దానిలో నిద్రింపుమని చెప్పెను. ఇపుడా ముచుకుందుడు అనంతగిరికి వచ్చి గుహలో శయనించియున్నాడు.

కావున ఓ విప్రవతంసా! మృకండ తనయా ! నీవాయనంతగిరి పరమ క్షేత్రంబున తపంబొనరింపుమని జెప్ప మార్కండేయుడిట్లనియె ఓ విధాతా ! నేనచటనే, దగు మంత్రంబును భగవంతునుపాసింతును జెప్పవేయన పరమేష్ఠి యిట్లనెను. ద్వాదశాక్షర విద్యచే భగవదుపాసన చేయుమని చెప్పి ఈ ద్వాదశాక్షర విద్య,నాస్తికులకు. బ్రహ్మఘ్నులకు, గోఘ్నులకు, స్త్రీలకు మూఢులకును పదేసింపరాదు ఆచార వంతులైన శిష్యుని శోధించి ఉపదేశింప వలయునని చెప్పిన నవ్వద్మభవుని వినుతించి మ్రొక్కి మార్కండేయుడు అనంతగిరీంద్రంబున కరుదెంచి కడుపవిత్రంబైన నచ్చోటునందు నివసించి యూర్ధ్వబాహుడై వేయివత్సరములు, పండుటాకు దిని రెండువేలేండ్లు, నిరాహారియగుచు, వేయి వత్సరములు, నింక వర్షఋతువున వానలో నిలిచి, చలికాలమున నీటిలోనిలిచి, ఎండకాలమున పంచాగ్ని మధ్యమున నిలిచి, యిట్లు పదివేలసంవత్సరంబులు ఈ మొత్తము పదునాలుగు వేలవత్సరములు పరిమితంబగు తపంబాచరించు చున్నంత యతని తపోగ్ని ప్రజ్వరిల్లదొడంగిన



భూతజాలంబు ఇంద్రాది దేవతులెల్లరుదిగులొంది మార్కండేయుని తపంబున కంతరాయము గల్పింపయత్నమాలోచించి పుంజకస్థలి మున్నగు సురవేశ్యలను సన్మానంబుగ రావించి పుంజకస్థలితో నిట్లనిరి "ఓ పడతీ ! రూపవతులగు దేవ కాంతలలో నీ వొక్కతవే సమస్త కళలనారితేరిన దానవు మా యందరకు నీ వలన చేకూరుకార్యమొకటి యున్నది. దానిని పూరించి మా కెల్లరకు మేలు చేకూర్పుము. భూతలంబున ననంతగిరి పై మార్కండేయుడపారమగు తపము చేయుచున్నాడు. మాలోనెవరి పదము నోపొందుటకై యావిప్రుడట్లు తపము చేయచున్నాడు. కావున నీ వచటి కేగి యతని తపోవిఘ్న మాచరింపు" మనిన యవ్వనిత మేను కంపింప భయమొందుచు నిట్లనియె. "మీరు నన్నీపనికి నియమించుట తగదు తపముచే దీపారుచున్న మార్కండేయుని దృక్కులు నిశితముగ నాపై సోకిన మిగులగలనా ? బ్రాహ్మణులకు కోపమెక్కువ గదా. నేను పోనోపనని" చెప్పిన మరల దేవతలిట్లనిరి.

"నీకు మన్మథుడు, వసంతుడు మలయానిలుడు మున్నగువారు సహాయముగా రాగలరు. వెరువక నెట్లయిన నమ్ముని తపము భంగ మొనర్పుమనిన"పుంజకస్థలి యిట్లనియె "అతడొక వేళ యలిగి మమ్మందర శపించిన మమ్ము రక్షించు వారీ దేవతలలో నెవరుగలరు ? చెప్పుడు మేము భయంకర కార్యమును చేయజాలమ"నిన దేవేంద్రుడు ధ్యానమాలిని జతపరిచి బలాత్కరించి మార్కండేయుని కడకు వారిని బంపెను. మన్మథాదులు సహాయమైరాగా సురవేశ్యలా మార్కండేయ తపోవనమునకు జేరిరి. అపుడు మలయానిలయము సుగంధయుక్తమై వీచెను. చెట్లు చిగురించెను. మునియున్న పరిసరముల సురకాంతలు నృత్యగీతాదులవిలసిల్లజొచ్చిరి.

అపుడు మౌని అచటి వాతావరణములో మార్పుగల్గుటయు తాళగానలయాది ధ్వనులు తనకు మెలకువ గలిగించుటయు అల్లనల్లన కన్నులు దెరచి వేల్పువెలవెలందర[illegible]దృష్టినుండి 

వారు తన కడ కరుదెంచిన దంతయు యరసి వారికిట్లనియె. "ఓ సురవేశ్యలారా ! మీరందరిచటకు వచ్చిన విషయములు తెలిసెను. దేవతలలో ఇంద్రపదవిని, లేక అగ్ని పదవిని, వరుణపదవిని మరియు బ్రహ్మపదవినేని యాశించి నేను తపమొనరించుటకు బూనలేదు. సాక్షాత్పరమాత్ముని ప్రీతికై తపంబు చేయుచునున్నాను. వారు మిమ్ములను నా తపోభంగమొనర్ప బంపియున్నారు. నేనిపుడు మిమ్ముశపించితినేని నా తపంబు తరిగి పోవును. గావునమిమ్ము శపింపక విడిచితిని. మీరు మీ లోకమున కేగుడనిన" తోడనే యా సుందరీమణులా మౌనికి నమస్కరించి అపారమగు నతని దయను గొనియాడుచు దేవలోకమున కేగి దేవేంద్రున కట్టి సమాచారము తెల్పిరి. ఇంద్రుడంత నేదియు తోచక తన పురోహితుడగు బృహస్పతిని బిలిపించి వినయముతో నమస్కరించి దేవతలతో గూడుకొని బ్రహ్మదేవుని సన్నిధికేగి యెల్లరతనికిసాగి మొక్కి యిట్లు పలికిరి.'ఓ సరస్వతీ మనోహర ! భూమి పై మార్కండేయుడు చేయుచున్న తపస్సుచే భూతలంబులెల్ల కంపించెను అద్రులదరెను. సూర్యచంద్రులు మార్గములు దప్పుచుండిరి. సాగరంబు కలుషించెను, అతని తపము వారించి మమ్మెల్ల కాపాడుమని" మొరపెట్టుకొనిరి. అపుడు బ్రహ్మ వారల కిట్లనియె "దేవతలారా ! యాతాపసిని మరలింప నాకే గాక పార్వతీశునీకైనా తరముగాదు అతని యిచ్ఛ పూర్తి జేయ శ్రీరమాధవుడే కావున మన మా జగన్నాథుని ఆశ్రయింతము పదండ"ని పద్మయోగి వారినెల్ల గూడికొని మహేశుని చేరి అతనిని వెంబడించుకొనీ క్షీరసాగరమున కేగి సర్వోత్తముడయిన జనార్దనుని పరమ భక్తిచే ప్రార్థించిరి.

అపుడాయిందిరామనోహరుడు వారి యెదుటకు వచ్చి బ్రహ్మదుల కిట్ల నియె "మీరలందరు ఇందరుదెంచుటకు కారణమేమి ? దైత్యులవలన మీ కేమైన భీతి కలుగదు గదా !" మార్కండేయుని తపోజ్వాల కోర్వలేక వచ్చితిరి కాబోలు అతడు మీలో. నెవరి పదవి నాశించి తపము చేయుటలేదు నా



యనుగ్రహ మొందుటకు నా సన్నిధానంబు గోరి తపంబొనర్చుచున్నాడు ఊరకనే భ్రాంతి నొందితిరి. మీరు భయపడనక్కర లేదు నేనేగి యతని యభీష్టము నెరవేర్తును మీరు మీ మీ నెలవులకరుగుడని" చెప్పిన తోడనే దేవతలెల్ల తమ తమ నెలవుల కేగిరి.

అపుడు నారాయణుడు గరుడారూఢుడై పార్షదానేకులు గొలువనెన్మిది దిక్కుల నిజప్రకాశ ప్రదీతులు పిక్కటిల్ల మర్కండేయుడు తపంబొనర్చుచున్న అనంతగిరి కాంతారమున కేతెంచెను. ఆ సమయమున నారదాది ఋషి సమూహము సబాంధవముగా వచ్చి జగన్నాథుడు మార్కండేయునకే మి ప్రసాదించునో చూతమని వేచియుండిరి.

అపుడు మార్కండేయుడు లక్ష్మీనిలయుని గాంచి అమితానందంబు న భక్తి పెంపిరివోవ సాష్టాంగ నమస్కారములు చేసి ఋషులకెల్ల నంజలి మోడ్చి వారిని ఆసనంబుల గూర్చుండుడని సంజ్ఞజేసి శ్రీ పద్మనాభుని నమస్కార పూర్వకంబగు ననేక విధముల స్తుతించెను. అతని భక్తి పారవశ్యత కెంతయు సంతసించి భగవంతుడా మార్కండేయున కిట్లనియె "వత్సా, నీ వలన చాలా తృప్తుడైతిని నీకు గల కోర్కె నేనెరుగుదును నేను భవిష్యత్తులో ముచుకుందుడనియెడు రాజర్షి దర్శన మిచ్చుటకు నీ గిరిపై కరుదెంచెదను. అతడు నీ గిరిగుహలో నిద్రించుచున్నాడు, ద్వాపరంబున చంద్రవంశమున వసుదేవుని వలన దేవకికి జన్మించి కృష్ణుడనంబరగి బాల్యమున నే, తృణావర్తాది అనేక దానవుల జంపి దుష్టుడైన కంసుని హతమార్చి ఉగ్రసేనునకు రాజ్యమొసంగెదను సాందీపుని వద్ద సకల విద్యలభ్యసించి యతని మృతపుత్రుని యమునిచే గొనితెచ్చి గురుదక్షణగ నతనికి నొసంగెదను, మధురాపురమున నేనుండ జరాసంధుని యుద్బోధ వలన కాలయవనుడు నా పైదండెత్తి వచ్చును. అపుడు బలరాముడు నేను [illegible] వచ్చి

వానికి బెదిరిన వారివలె అతివేగముగ పరుగెత్తి నీ గిరిపై కెక్కి మాయమయ్యెదము. కాలయవనుడు మా వెన్నంటి వచ్చి నా వలన మోహితుడై ముచుకుందుడు నిద్రించు గుహజొచ్చి అతని వలన భస్మీభూతుడైచచ్చును.

అపుడా రాజర్షికి దర్శనమిచ్చి అతని పేరట ముచుకుందుయను నదిని ప్రవహింపజేయుదును ఆ సమయమున నే నీకు దర్శనమిచ్చి నీ పేరట మార్కండేయ క్షేత్రముగ నీ యనంతగిరిని ప్రసిద్ధినొందింతును. ఇచటి పల్వలమునకు ఆషాఢశుద్ధఏకాదశి దినము గంగను ప్రవహిపంజేతును. అప్పటి నుండి నీకై నిచట శాశ్వతముగా వసించెదను కావున కుమారా యందాక నీ విందే నన్ను నుష్ఠింపుచు తపము సేయుచుండమని చెప్పి భగవంతుడంతర్ధాన మయ్యెను.

ముని పుంగవుడు సంతసించుచు అచటనే తపము సేయుచుండెను కొంతకాలమున భూమి పై దైత్యాంశములచే కొందరు రాజులు అనేక దుష్టకార్యము లాచరింపుచు ధరణిని పీడింపజొచ్చిరి. అపుడు భూమి స్త్రీరూపధారిణియై బ్రహ్మదేవుని సందర్శించి యేడ్చుచు దుష్టుల వలన తనకు కలిగిన బాధలను నివారింప గోరెను. తక్షణమే బ్రహ్మ భూదేవితో సహా దేవతనెల్ల గూడి క్షీరసాగరం జేరి శ్రీమన్మహావిష్ణువును అనేక విధంబుల ప్రార్థించెను. అపుడు నారాయణుండు సాక్షాత్కరించి వారల నూరార్చిపంపి తన రెండు కేశములను తెల్లది నల్లది భూలోకమునకు పంపెను రోహిణికి దేవకికి బలరామకృష్ణులై తెలుపు నలుపు దేహములచేత భూలోకమున నవతరించిరి. కృష్ణుడు బలరాముడు నందుని ఇల్లు జేరి అందు బాల్యము బుచ్చుచు అనుకులయిన దానవులను సంహరించుచు కంసుని హతమార్చి ఉగ్రసేనుని భూరాజ్యమునకు పట్టభద్రుని జేయుచు సాందీపుని వద్దసకల విద్యల నభ్యసించి మృతుడైన గురుపుత్రుని యమునివద్ద నుండి గొనివచ్చి యొజ్జకు గురుదక్షణగా నొసంగిరి.



బలరామ కృష్ణులు మధురకేతెంచగనే జరానంధుడు చతురంగబలసమేతుడై కృష్ణునిపై దండెత్తి వచ్చి యోడిపారుచు ఇట్లు పదునేడుసారులు మధురపై దండెత్త వచ్చి మరలిపోయి రుద్రాంశసంభవుడయిన కాలయవనుని ప్రేరేపించి కృష్ణునిపై దండెత్తుటకు సిద్ధపరచెను. నారదోపదిష్టుడైయవనుడు క్రోధపూరితుడై యిరువది యొక్క యక్షోహిణీల సైన్యముతో జరాసంధుడు తనవెంబడిరాగా కృష్ణుని చంపుదము లేదా కట్టితెత్తమను నాలోచనతోవచ్చి మధురాపురమున ముట్టడించిరి, అపుడు కృష్ణుడు బలరామునితో నిట్లనియె " అన్నా యిపుడు జరాసంధుడు కాలయవనుని ముందిడుకొని మనల జయింప గోరివచ్చినాడు కాలయవనుడు మనచే చంపబడువాడుకాడు. వీడుముచుకుందడను రాజర్షిచే సంహరింపబడును. అతడిపుడు శేషాచల పుచ్ఛభాగమై అనంతగిరిగుహలో శయనించియున్నాడు. నేనెటులైన నతనిని ప్రసాదించవలయును. మార్కండేయుడు అచటనే తపము చేయుచున్నాడు వారిరువురిని యనుగ్రహింపవలయును కావున మనమిపుడా యవనుని ముందునుండి నిశ్శస్త్రులమై యరుగవలెను వాడుమనలను వెంబడించును.

అపుడు మనము మా యాగమనమున బోవుచు ముచుకుందునిచే ఆ దుష్టుని నంత మొందింపవలయును అని చెప్పి యిరువురు నిశ్శస్త్రులై కాలయవనుడున్న యెడ కరిగినంతనే వాడు అట్టహాసముజేయుచు నిట్లనియె. వెర్రిబుడతలారా! యే శస్త్రాస్త్రములు బట్టకయే యుద్ధసన్నద్ధుడనై యున్న నాకడకు మీరువచ్చుట యచ్చెరువగుచున్నది యిదిగో యిపుడు మీరెందుజొచ్చి నను నేను మిమ్ము జంపునంత వరకు విడువను నన్నెదిరి నిలువుడని పైబడ పోవుచుండ బలరామకృష్ణులిరువురు నురకసాగిరి.

యవను డలిగి సబలుడై రధము పై గూర్చొని వారి వెన్నంటినరదము బరచెను. యింతింత వారి వేగము నెక్కుడగుటయు వాడురథమును విడిచి

నొరనుండి కత్తిని బెరకి కరముచే నెత్తి అతి వేగమున రామకృష్ణుల వెన్నంటి యురికెను. వారు మాయాగమనము జేయదొడగిరి అంతవాడు అనంతగిరి పై కరిగి అచట రెండు కమలాకరములు అతిమనోహరములై హంసనారండవ చక్రవాకములచే వారు కూజితమగుచు పద్మకైరవామోద సుగంధామోదమేదురంబగుచు వింత గొలుపుచుండ తత్తటమున నొకముని తపముజేయుచుండుట యవనుడు జూచి మార్కండేయునితో నిట్టనియె "ఓ మునివర్యా ! యిచట మీకిరివురు కృపాణులొనరులు గాన్పించిరా ! వారు తెలుపు నలుపు మేనుల నల్లనిదగు పచ్చనిదగు పీతాంబరములను నడుమునవెలయువారు. నా వలన భయము జెందియిటు వచ్చి ముందున బారిరేమో తెలిపిన మీకుచాల పుణ్యముండు" నని పలికిన తోడనే మార్కండేయుడు నెమ్మనములో నిట్లుతలచెను.

అలనాడచ్యుతుడు జెప్పిన వాక్యములు సిద్ధించుసమయమేతెంచెనను కొని ముసిముసి నగవుదేర కాలయవనుని కిట్లనియె, ఓయీ నీవనువారలలో నొకనిని చూచితిని. నీవను నట్లతడు నల్లని మేనివాడు పీతాంబరము గట్టినాడు మహతేజస్వి. ఈ కొంత దవ్వుననే గుహలో నిద్రించుచున్నాడు. ఈ మార్గమున బొమ్ము, గుహ యచటనేకలదు. అందు అతడు నీ కగుపడును. అనుట తోడనే యవనుడమిత వేగముగ గుహలో జొచ్చి నిద్రించుచున్న ముచుకుందుని తనకాలెత్తి బలముగ తన్నసాగెను. తక్షణమే ముచుకుందుడు మేల్కొంచి యవనుని జూచి దహించి వైచెను.

అంత శ్రీ కృష్ణభగవానుడు ముచుకుందుని యెదుట సాక్షాత్కరించిన రాజర్షి భక్తిపూరిత మనస్కుడై యచ్యుతుని స్తుతింపుచు నమస్కరించెను. శ్రీకృష్ణుడపుడు తన విశ్వరూపమును ఆ రాజర్షికి గనపరచెను ముచుకుందాడా రూపమును జూచి యచ్చెరువంది అనేక విధముల ప్రార్థించుచు వేదవేదాంగమయుడైన నా విశ్వరూపుని వివిధ రీతుల వేదమంత్రంబుల స్తోత్రము జేయుచున్నంత భగవానుడు ముచుకుందుని ననుగ్రహింపనిట్లనియె



"ఓదయామయా ! మీరీ విశ్వరూపముపసంహరించి శ్వేతరూపమగు యనంత పద్మనాభురూపివై యిచ్చటనే వసింపగా మిమ్ము వేడుచున్నాను." అనినతోడనే "నీవు కోరినట్లు నేనిచటనే సన్నిధిచేసెద, దర్శనంఇచ్చెద నీవిక విచారింపవలదు. నంతసింపు"మని కృష్ణభగవానుడు సెలవిచ్చినంతనే మరల ముచుకుందుడిట్లనియె, 'ప్రభూ ! భక్తవత్సాలా ! మీయమోఘ దర్శనంబు వలన సఫలంబు చెందితిని ఇంకొకకోరికయనుగ్రహింపుము. మీరుసన్నిధి చేసిన నిత్తాపునుండి నా పేరంబరుగు యొక నదిని ప్రవహింప జేయుము అద్దానిలో స్నానము చేసినవారు అందరు అవ్యయమైన మీపాద సాన్నిధ్యము లభించునట్లు సేయుమనిన పరమాత్ముడు తన విశ్వరూపమును తిరోగమింపజేసుకొని యిట్లనియే ఓ ముచుకుందా ! నీకమండలోదకమున నాపాదంబులు కడుగుము దానిలో సమస్తతీర్థంబులును సాగరంబులు నదీనదంబులు లొక్కటిగా కలసియిపుడె యిచట నదీ రూపమై పుట్టి ప్రవహించును.

కుమారా ! అట్టినది నీ పేరుతో ముచుకుందా నదీనామంబున సకల లోకంబులను పవిత్రంబు సేయును అని రాజర్షికి సుప్రసన్నుడై వరంబుల ననుగ్రహించిన జగద్గురుండగు కృష్ణభగవానుని మార్కండేయుండు యోగదృష్టితో తిలకించి తక్షణమే భగవత్సన్నిధానంబున కరుదెంచి హర్షపులకాంకిత సర్వాంగుడై సాష్టాంగనమస్కారము గావించి బద్ధాంజలియై యిట్లనియె హే ముకుందా ! కృష్ణా ! మున్ను మీరు యెట్లు చెప్పియుంటిరో అట్లుచేసితిరి ఓ లక్ష్మీరమణా ! యిక నేను కృతార్థుండనైతిని. ప్రభూ ! నాతపము పండెను. నాస్థానంబభివృద్ధిపొందెను రాజర్షియగు ముచుకుందుని పేరుతో నదియును నా పేరుతో ఈ చోటును ప్రసిద్ధము సేయుము, ఏజనులీతావును చూచి ముచుకుందా నదీలో స్నానము చేతురో వారికెల్లరకు స్వర్గప్రాప్తి ననుగ్రహింపుము. సకల తీర్థములు పుణ్యనదులు కొలంకులకు వచ్చునని మనుమీరెట్లు వచియించిత[illegible] పరాత్పరా

ఎపుడెపుడైనన మీపాదమున గంగామ తల్లి సకలలోక సమక్షంబున నిచ్చటికి వచ్చుచుండుగాక ఇచ్చటనె నాదుభగవన్నిష్ఠ యెల్లప్పుడు నిర్వర్తించుచుండుగాక. హరీ! యిట్లుసేయుచు మార్కండేయ క్షేత్రధామమున దీనివి మహాస్థలంబుగా సేసి దేవ దేవా! పెంపొందింప చేయుము. అ పల్వలంబులగు నీ సరస్సులకు పరమ పవిత్ర గంగాభవానీ వచ్చునట్లు సేయుము భక్తులకోరికలు తీర్చుట మీయభిమతము. శ్రీహరీ ! కాశికా నగరంలో ప్రవహించు గంగా స్రవంతి వలెనే యిందు ప్రవహించునట్లుచేయుము ఓ కరుణానిధీ ! నేను బాలకుండను మీరుజనకులు కుమారుడు మూర్ఖముచే కోరిన కోరికలను తండ్రి ఫలింపజేయుట భాగ్యమే కదా. అట్లే నా కోరికలు ఫలింప జేయుట కర్తవ్యము. ఇదే మీకు శతసహస్రవందనములు అని వేడుకొను మార్కండేయుని కోరికకు పద్మనాభుడు కడుదయామయుండై యిట్లనియె.

వత్సా ! నీ యభిమతానుసారముగా నన్నియు నెరవేరును. మహామతీ నిన్ననుగ్రహించుటకు తప్పక మంగళకరంబగు ఆషాడ శుద్ధ యేకాదశి దినమున యెల్లలోకములుచూచుచుండ త్రిపథగామిని యగు గంగాస్రవంతి నీ కొలనులకు అవశ్యమరుదెంచును. నేనిందే నివసింతును. అలా వచ్చినవారు గంగను దర్శించెదరు మహాయోగీ ! అట్టి జలంబున స్నానమెవరుచేతురో వారెల్లరు మిగుల పావనులగుదురు. బ్రహ్మహంత, బాలహంత, గోహంత నింక కల్లు ద్రావినవారును బ్రాహ్మణుని నిందించినవారును, గురుభార్యను బొందినవారును యిందుగ్రుంకినతోడనే పవిత్రులగుదురు. మరియు నీసరస్సులలో ముచుకుందానదిలో వ్యతిపాతునందు, పూర్ణిమ శుక్రవారము, ఏకాదశి, అమావాస్య, సక్రాంతి మున్నగు పుణ్యదినంబులందు ఏ మానవులు స్నానమొనర్చి పితరు లకు తర్పణములిత్తురో అట్టివారలకగు పుణ్యఫలంబుల చేప్పెద వినుము. పుత్రులగోరిన పుత్రులగుదురు ధనమర్థించిన ధనవంతులగుదురు 'బద్దులు బంధనము నుండి విముక్తులగుదురు. రోగులు



రోగములు బాయుదురు ఇంక ఇలవేల్పు గొప్పవాఙ్మయగును, క్షత్రియుడు విజయుడగును, కోమటియంగడిలో రత్నరాసులమ్మును, శూద్రుడు మహాత్ముడగును చండాలుడైనను విశుద్ధాత్మడగును ఇచట నీజలంబున యజ్ఞనంబాడని పురుషులు సరీసృపాది జంతువులును జలపక్షీముఖ విహంగములును చేపలు తాబేలు మున్నగునవి జలస్పర్శ మాత్రంబున పవిత్రంబులగును అమృతప్రాయమైన ఈజలమందేవరు నిత్యము స్నానముచేయుదురో వారెల్ల లోకములనతిక్రమించి శాశ్వితముగా నా లోకము పొందియుందురు. ఇందేప్రతినిత్యము నివసించి తీర్థసేవనముచేయు వారెల్లరు నిస్సందేహముగా విముక్తులగుదురు. నన్నాశ్రయించువాడు మూర్ఖుడైనను హతవాదియైనను నింధితుడైనను మూఢుడైనను అట్టివాడు కాలసూత్రమున నా ప్రసాదంబు నీదగు ఈ క్షేత్రము సమస్తలోక వంద్యమగును. సకల కల్మషంబుల హరించును సమస్త రోగంబులదెగటార్చునని తెలుసుకొనుము. ఇట్లు వెలసిన క్షేత్రమహత్యంబును అసక్తితో నిత్యమెవడీప్రదేశంబున పఠించునో అతడేది కోరుకొనునో అట్టిఫలంబులవశ్యముగా లభించును.

ఈ క్షేత్రంబున నియత చిత్తులై శ్రీమద్భాగవతమైనను రామాయణమైనను భారతమైనను పుణ్యకరంబయిన మన్నామ సహస్రంబును నిత్యమెవడు పఠించునో అతడమరోజ్వలుడై జనించును. పదనొకండు పర్యాయములు నియతచిత్తుడై ప్రసన్న బుద్ధితో సహస్రనామపఠనంబు చేసినచో కలుగు ఫలముల విపరింతు వినుము. సంచితముగా శతజన్మములనుండి యార్జించిన పాపముల భస్మీపటలమగును, దశాపరేశంబుల పూర్వపరేశంబగు వంశస్థుల కెల్లముక్తిదాయకులగుదురు. అని సర్వోత్తముడగు శ్రీ కృష్ణుడు వచించి తిరోగతుండయ్యెను.

ఇలా సకలదేవ వంద్యుడైన గోవిందుడంతర్థానము చెందిన తోడనే ముచుకుందుమహర్షి శ్రీకృష్ణచోదితుడై మార్కండేయ మహర్షికి వందనంబాచరించి

గంధమాదన పర్వతంబున కేగెను. అశ్వరంబగు నా మహావిష్ణుండు తనకు దర్శనంబిచ్చిన రూపంబును విజితేంద్రియుండై భావించుచు ముక్తికాముడై తపంబు సేయుచుండెను. యోగిపుంగవుడగు మార్కండేయుడు తిరోగతుడైన మహావిష్ణువును అట్లేగిన ముచుకుందుని తలచుకొనుచు హర్షాతిరేకమున పులకలొందు మేనితో మహాప్రాజ్ఞుండు లక్ష్మీనాధుని తపోయోగమున ధ్యానించుచు తత్పదమే అవధిగాకోరి యందే యుండెను ఇలా కొంత కాలమేగుచుండ నొకపుడింద్రసఖుండైన విశ్వావసుడగు గంధర్వుడొకడు సూర్యసన్నిభంబైన విమానమెక్కి అన్నిలోకములు గ్రుమ్మరుటకు బయలుదేరి తిరుగుచు విధివశముచే చంద్రుని ధిక్కరించుచు వెండికొండకు వచ్చుచు మార్గమధ్యమున వనమందుగల సరస్సులో శౌనకుండను బ్రహ్మర్షి స్నానము చేయుచుండగ అతనివైపు చూడక గౌరవముతో వందనము చేయక నిజేచ్ఛతోపోవుచుండెను.

అటుపోవుచున్న విశ్వావసుని శౌనకుడు చూచి "ఔరా ! నన్ను గాంచియు గర్విష్టుడై అన్ను మిన్నుగానక నమ్రభావము విడిచి వీడేగుచున్నాడని", క్రోధించి తన చూపు విశ్వావసునిపై బరపి " ఓరి విశ్వావసా! మాన్యులు కంట బడిననూ మదాంధుడవై గౌరవించక యేగుచుంటివి యిపుడే నీ విమానముకుమ్మరిసారెవలె భూమి పై గూలుగాక, నీవు తక్షణమే చండాలుడవౌదువు గాక నీ యనుచరులు నీ యట్లే యగుచు నిన్ను సేవింతురుగాక ! యని శాపమిచ్చెను.

వెంటనే విశ్వావసుని విమానము భూమిపై గూలెను. గంధర్వుడు విహ్వలచిత్తుడై బ్రహ్మర్షి పాదములాశ్రయించి దీనవదనుడై రోదనముచేయుచు బహువిధముల వేడికొనెను "స్వామీ! ఊరపిచ్చుకపై బ్రహ్మాస్త్రము ప్రయోగించినట్లు మీయట్టి మునులు అల్పుడనగు నన్నిట్లు శపించిన ఏమి ప్రయోజనము, నా యపరాధము మన్నించి నన్నునుగ్రహింపుమని శాపము త్రోసిపుచ్చుమని విలపించుచు వేడికొనినను బ్రహ్మర్షి వానిని మన్నించక వెడలిపోయెను.



తక్షణమే తన నావరించిన చండాలరూపములో విశ్వావసుడు తబ్బిబ్బుబడుచు అనుచరులతో వెడలి కాశీ నగరము చేరి అందు సంచరించుచుండెను ఇంద్రుడు తన నెచ్చెలియగు విశ్వావసుడు కొలవుకూటము బహునాళ్ళనుండి వచ్చుట లేమికి యోచించి, ఒకనాడేనియు తన దర్శనము వీడని విశ్వావసుడెందులకు రాకుండెనని దివ్యదృష్టితో అతని యుదంతము తిలికించి వాసవుడే మాలని రూపము గైకొని కాశినగర చండాల వాటిక యందు జొచ్చి, యందు దీన యనుచరులతో దిరుగుచున్న మిత్రుని వీక్షించి కుంగుచు యతని కిట్లనియె.

ఓ మహా మతీ నీ వెవడవు? బ్రహ్మర్షి శాపపీడితుడవగు విశ్వావసుడవు కావు గదా ! యనిన నబ్బురముతో చండాలరూపియగు గంధర్వుడిట్లనియె "అయ్యా నీవెవరో కాని నన్ను విశ్వావసునామముతో అడుగుటచే చెప్పెద వినుము. నేను దేవేంద్రుని మిత్రుడను, విశ్వావసుడను గంధర్వుడను విధివశముచే శౌనక శాపోపహతుడనైతని. శాపవిముక్తిచేయుమని యా మునినెంత బ్రతిమాలినను చేయడయ్యెను. మున్నేమిజేసితినో నాకీదుర్గతివాటిల్లినదని" గోడుగోడున యేడ్చుచు మొగం వంచినిలిచినంతనే మాలనిరూపముతో వచ్చిన శక్రుడిట్లనియె.

ఓ ప్రియా ! మిత్రమా ! నీవునాకొలువున కేతేరక చాల దినములగుట కేమి కారణమో దివ్యదృష్టితో నీ తెరగెల్ల యరసి వెంటనే యిందువచ్చితిని. గడిచిన విషయమును గూర్చి పరితపించిన ప్రయోజనము లేదు. నీకొక ఉపాయం జెప్పెద వినుము. శేషాద్రికిపుచ్ఛబాగమైన అనంతగిరిపై అనాది నిధినుడైన మహావిష్ణువుని గూర్చి మార్కండేయ మహార్షితపము జేయుచున్నాడు. మరియు నాసఖుడైన ముచుకుంద రాజర్షి అందే శ్రీకృష్ణభగవానుని సందర్శించి తన పేరుతో ముచుకుందా నది ప్రవహింప జేసికొన్నాడు.

అదిలోకపావనము ముచుకుందుడు తన కమండలోదకమున సాక్షాదనంతుని చరణపద్మములు కడుగునపుడు సకల తీర్థములు సప్తసముద్ర

జలంలు పుణ్యసరస్సులు మున్నగువాటి పవిత్రజలములు కమండల జలములందావిర్భవించునని భగవానుడు స్వయముగా జెప్పెను.

అట్టి పావన జలమే ముచుకుందానదియై ప్రవహించెను. మరియు మార్కండేయ మహర్షి సరస్సునకు ఆషాడశుద్ధ యేకాదశి తిథినాడు విష్ణుపాదసంజాతయగు గంగాభవాని నిజరూపముతో ప్రత్యక్షముగా వచ్చి సరోజజలముల కలియును, ఇక ముచుకుందా నదిలో ఏ ప్రాణిశరీరమువీడునో అచట రాతి యందైనను మరణం పొందునో ఆప్రాణి తప్పక పరమవదము నొందును. మార్కండేయ ఋషీంద్రుని సామర్థ్యమున చండాలుడైనను బ్రహ్మఘాతుకుడైనను నా స్థలమునకు పోలేరు.

మార్కండేయ సరస్సులో మరియు ముచుకుందానదిలో ఎపుడు స్నానము చేయగలవో, శ్రీమదనంత పద్మనాభస్వామిని యెపుడు చూడగలవో, అపుడు తప్పక నీచండాలత్వము వీడెదవు. అపుడే నీకు శాపవిముక్తి కలుగగలదు. తొంటి రూపమును ధరింతువు అట్లు చేయుటకు నీకు తగిన ఉపాయం చెప్పెద వినుము. ప్రతి నిత్యము ముని సత్తముడు తన నివాసము నుండి బయలుదేరి శ్రీ మదనంత పద్మనాభుని పూజించుచుండును. ఎపుడో యొకప్పుడు తన కోరికపై యటునిటు తిరుగుచుండును. ఆ ధర్మాత్ముడట్లు సేయుచున్నపుడు యతని మార్గమున అవినిత శిరస్కుడవై వినయముతో నిలువుము. ఒకవేళ య ఆమహాత్ముడు కోపించినను నీవు కంపించక యత్యంత భక్తి వినయత్వము కనుపరుపుచు వేడుకొనుము అపుడా మహాత్ముడు దయామయుడై నీయుదంత మడుగును. నిన్నెరిగి తప్పక నిన్ననుగ్రహించునని చెప్పి ఇంద్రుడేగెను.

అపుడు విశ్వావసుడు పరమ పునీతమైన శేషాద్రికి తోకగా నున్నయనంతగిరిపై పద్మనాభుని సన్నిధానంబునకు వచ్చి మార్కండేయుని దర్శనమునకై వేచియుండెను. అంత కొంత కాలవేగిననీదట యొకవుడు



వసంతమేతెంచుటయు వైశాఖ శుద్ధ పూర్ణిమా దినంబున నమ్మహర్షి అనంతుని పూజించి శిష్యగణంబులతో బయలు వెడలి వినోదార్థము సమీపమందలి వనమున కేగి అటు ఇటు తిరుగుచుండెను. అట్టితరియా తపస్విబాటకెదురై తలవంచి "నేను విశ్వావసుడను శరణ్యుడను, శరణ్యుడను, పాహిమాం, పాహిమాం" యని వేడు కొనెను. "ఓరీ ! నీవు చండాలుని వలెనున్నావు బ్రహ్మణ శ్రేష్ఠునకిటు యెదురు నిలువ వచ్చునా ? నీవెవరవు ? యిందేల జొచ్చితివి ?" యని యించుక కోపముతో పలుకు మునివర్యునకు గద్గద స్వరముతో విశ్వావసుండిట్లనియె.

మహాత్మా నేను బ్రహ్మర్షి శాపముచే చండాలత్వ మొందితిని మున్ను నేనింద్రుని సఖుడగు విశ్వావసుడను గంధర్వుడను 'విధివశముచే యిట్లయితిని. శాపవిమోచన మొనర్చుమని యెంత వేడినను యా తేజస్వి కరుణించడాయెను. అపుడు విశ్వావసుఁడు మరల నమ్ముని కిట్లనియె. మీరుదక్క నాకు శాపవిముక్తి కలిగించు వారెవ్వరులేరు. మిమ్ముశరణుజొచ్చితిని. కారుణ్యముతో నాకు శాపవిముక్తి గావించి యుద్ధరించుమని అతికరుణముగ నేడ్చిన కృపాయతచిత్తుడై మార్కండేయుడు దివ్యదృష్టితో వాని పూర్వ వృత్తాంతము నెరింగి వాని కిట్లనియె.

"విశ్వావసా ! నీవు పలికిన దెల్ల నిజము విధికి యంతవారైన చిక్కవలసినదే ఇవుడు నీవు నా సరస్సులో స్నాన మొనర్చి ముచుకుందానదిలో మజ్జనంబాచరింపుము వెంటనే నీ తొంటి రూపమును చేకొందువు నీ యనుచరులు నటులే విముక్తులగుదురు. శ్రీ మనంతపద్మనాభుని సేవించి శాశ్వత పదము పొందుడని దీవించెను. గంధర్వుడంత ముని చంద్రుని స్తుతించి మ్రొక్కిసరస్సున ముచుకుందానదిలో స్నానమాచరించి, యనుచరుల నావిధముగ చేయించ , యెల్లరు చెండాల రూపములను వదిలి నిజరూపముల ధరించి అనంతుని భజించి నిజనివాసంబులకు యదేచ్ఛగా జనిరి. అని ఇట్లు పరాశర మహామునీంద్రుడు మైత్రేయునకు [illegible] మహాత్మ్యము

వివరించెనని సూతుడు శౌనకాదికులకు జెప్పెను.

ఈ ప్రకారము జెప్పబడిన యీ దివ్య మహాత్త్యము విన్నవారు ఆనంత పద్మనాభుని కృపకు పాత్రులై అజరామరమగు పదము నొంది నిత్యసంతోషులై యదేచ్ఛగ సుఖించగలరని సూతుడు చెప్పెను.

ఇది శ్రీ విష్ణు పురాణాంతర్గతమై వెలయుచున్న ముచుకుందా మహత్మ్యంబను అనంతగిరి మహత్మ్యము సంపూర్ణము

శ్రీకృష్ణార్పణమస్తు

